VISALAANDHRA VIJAYAWADA Phone No. 375

6 పేజీలు 6 నయాపైసలు రిజిష్టర్డు నెం A 193

# విశాలాంధ్ర

7059 17

సంపుటి 6 * విజయవాడ శుక్రవారం ఫాల్గుణం 23-1879 [మార్చి 14-1958] * సంచిక 342

## అట్లాంటిక్, బాగ్దాద్ కూటాలతో ఆగ్నేయాసియా కూటమి సంబంధాలు

మనీలా, మార్చి 13

అట్లాంటిక్, బాగ్దాద్ సైనిక కూటాల ప్రధాన కార్యాలయాలతో నిరంతరం సంబంధాలు పెట్టుకోవాలనీ, ముందు ముందు ఈ సంబంధాలను పెంచుకోవాలనీ ఆగ్నేయాసియా కూటమి ప్రధాన కార్యదర్శికి అధికారం ఇస్తూ ఆ కూటమి మంత్రుల మండలి నేడొక ప్రకటన చేసింది. మూడు రోజులుగా జరుగుతూన్న ఈ మండలి సమావేశం నేడు ముగిసింది.

## పార్వతీపురంలో సూరిదొర ఎన్నిక ఖాయం

### ఆ ఎన్నిక చెల్లదని ట్రిబ్యునల్ యిచ్చిన తీర్పును నిరాకరిస్తూ ఆంధ్ర హైకోర్టు నిర్ణయం

హైదరాబాద్, మార్చి 13

పార్వతీపురం ద్విసభ్య నియోజకవర్గం నుండి శాసనసభకు సోషలిస్టు సభ్యుడు శ్రీ తిప్పల సూరిదొర ఎన్నిక చెల్లనేరదని, ఎన్నికల ట్రిబ్యునల్ యిచ్చిన తీర్పును ఆంధ్రప్రదేశ్ హైకోర్టు నిరాకరించింది.

ట్రిబ్యునల్ తీర్పును సవాలు చేస్తూ శ్రీ సూరిదొర ఆంధ్ర హైకోర్టుకు అప్పీలు చేసుకొన్న విషయం పాఠకులకు విదితమే.

# హరిజన గిరిజనాభ్యుదయం పట్ల ఆంధ్ర ప్రభుత్వం అశ్రద్ధ

## ఆంధ్ర శాసనసభలో అన్ని పక్షాలకు చెందిన హరిజన సభ్యుల తీవ్ర విమర్శ

### సంక్షేమశాఖ పద్దుకు సభవారి ఆమోదం

(విశాలాంధ్ర విలేఖరి)

హైదరాబాద్, మార్చి 13

హరిజన గిరిజన, సంక్షేమానికి ప్రభుత్వం కేటాయించిన మొత్తాలు చాలవనీ, హరిజనులకు బంజర్లు నివేశన స్థలాలు పంచాలనీ నేడు ఆంధ్ర శాసన సభలో సంక్షేమ పద్దుపై ప్రసంగించిన సభ్యులందరూ సూచించారు.

నేటి చర్చలో పాల్గొన్న హరిజన సభ్యులందరూ పార్టీ విభేదాలు లేకుండా ప్రభుత్వ విధానాన్ని తీవ్రంగా విమర్శించారు.

పద్దుపై వచ్చిన కోత తీర్మానాలన్నీ వీగిపోయాయి. మలయప్పన్ కమిటీ నివేదికను ప్రభుత్వం అమలు జరపాలని శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, తెలంగాణాలో వెనుకబడిన కులాల హాస్టళ్ళకు, విముక్తజాతుల హాస్టళ్ళకు ప్రభుత్వం తగినంత ఆర్థిక సహాయం చేయలేనందుకు శ్రీ ధర్మభిక్షం, హరిజనులకు నివేశన స్థలాలు పంచినీరు, వైద్యసౌకర్యాలను కల్పించనందుకు శ్రీ భాట్టం శ్రీరామమూర్తిగారు ప్రతిపాదించిన కోత తీర్మానాలపై డివిజన్లు కోరారు.

తర్వాత సభవారు పద్దును ఆమోదించారు.

సాంఘిక సంక్షేమ మంత్రి శ్రీ సంజీవయ్యగారు నేడు శాసనసభలో నిమ్న జాతుల, గిరిజనుల పద్దుపై ప్రసంగిస్తూ వారి బిడ్డలకు స్కాలరు షిప్పులు, హాస్టళ్ళు, వారికి నివేశన స్థలాలు, అంగడసౌకర్యాలు మున్నగు సమస్యలపై అంటీ అంటనట్లు ప్రసంగించారు.

తెలంగాణాలో హరిజన హాస్టళ్ళు ఎక్కువ లేవన్నారు. సభ్యులీ విషయంలో చొరవ తీసుకొంటే ప్రభుత్వం ఉదారంగా సహాయం చేస్తుందన్నారు.

ఎదో ఒక హాస్టలులో అవినీతి ఉన్నదని చెప్పి అన్ని హాస్టళ్ళను ప్రభుత్వం తీసుకోనడం మంచిది కాదన్నారు. వెనుకబడిన కులాల హాస్టళ్ళలో డబ్బు తీసుకొని నడిపే వారికి ప్రభుత్వం సహాయం చేయబోదన్నారు.

#### స్కాలరుషిప్పులు

స్కాలరుషిప్పుల సమస్యను ప్రస్తావించి వెనుకబడిన జాతులవారికి ఇచ్చిన స్కాలరుషిప్పులన్నీ హరిజనులకే వెళ్ళినట్లు మంత్రిగారు ఒప్పుకొన్నారు. వెనకబడినవారి అర్హతలనే కాక వారి పేదరికాన్ని కూడా దృష్టిలో పెట్టుకొని స్కాలరుషిప్పులు ఇవ్వాలని తాము అనుకొన్నామన్నారు.

స్కాలరుషిప్పులను కేంద్రం ఇచ్చే పద్ధతిని రద్దు చేయాలని రాష్ట్ర ప్రభుత్వం కోరిందన్నారు. ఢిల్లీలో కూర్చున్నవారికి ఏ దరఖాస్తు సరియైనదో ఏది కాదో తెలుసుకొనడం కష్టమన్నారు. స్కాలరుషిప్పులకోసం కేటాయించే సొమ్మును రాష్ట్రాల కప్పగించడం మంచిదని ఆయన చెప్పారు.

#### నివేశన స్థలాలు

నివేశనస్థలాల విషయంలో కేంద్రంనుంచి సహాయం వస్తుందని ఆశించి లాభం లేదన్నారు. రాష్ట్రం కూడా ఒక పరిమితికి మించి ఎక్కువ భూమిని సేకరించడం సాధ్యం కాదని చెప్పారు. అందుకని భూదానం లాగానే నివేశన స్థల దానాన్ని ప్రారంభిస్తే ఈ సమస్య పరిష్కారమవుతుందన్నారు.

నివేశన స్థలాలు అడవులకు దగ్గరలో వుంటే కలప ఉచితంగా గాని, కొద్ది ధరకు గాని ఇవ్వడానికి అడవుల మంత్రి అంగీకరించారని చెప్పారు.

గిరిజనులు పిప్పళ్ళను కారుచౌకగా అమ్ముకొంటున్నారని వారిని మార్వాడీలు, మైదానంవారు దోచుకొంటున్నారనీ చెప్పారు. పిప్పళ్ళలో 50 లక్షల వ్యాపారం జరుగుతుంది. కాని ఇందులో 5 లక్షలు మాత్రమే గిరిజనులకు దక్కుతుంది. మిగిలినదంతా మార్వాడీలు మింగేస్తున్నారు అని ఆయన వెల్లడించారు. గిరిజనుల సౌకర్యార్థం ఒక మార్కెటింగు కార్పొరేషన్ను ఇప్పుడు నెలకొల్పనున్నారు.

#### శ్రీ స్వర్ణవేమయ్యగారి ప్రసంగం

మొత్తం 2,39,16,000 రూపాయలకు ప్రతిపాదించిన ఈ పద్దుపై పి. డి. ఎఫ్. కమ్యూనిస్టు సభ్యుడు శ్రీ స్వర్ణ వేమయ్యగారు చర్చను ప్రారంభిస్తూ ఇలా అన్నారు:

పల్లెల్లో అంటరానితనం తీవ్రంగా వుంది. ఈ విషయంలో కేంద్ర రాష్ట్ర చట్టాలు పని చేయడం లేదు. మంత్రిగారు మాటవరుసకైనా ఈ విషయాన్ని ప్రస్తావించలేదు. నెల్లూరు జిల్లా వాడకాయపూడి గ్రామంలో

(మిగతా 2 వ పేజీలో)

## గోపాలరెడ్డిగారికి కేంద్ర మంత్రిపదవి

హైదరాబాదు, మార్చి 13

గోపాలరెడ్డిగారు కేంద్ర మంత్రి అవుతారన్న విషయంలో అధికార రీత్యా ఏమీ తెలియరావడం లేదు కాని ఆయన కేంద్ర మంత్రి అవడం ఖాయం అన్న సూచనలు మాత్రం కానవస్తున్నాయి.

గోపాలరెడ్డిగారు నెల్లూరు నుంచి తిరిగి వచ్చి ఇక్కడ శాసనసభలో అడుగు పెట్టగానే చాలామంది సభ్యులు ఆయనకు ధన్యవాదాలర్పించారు. గోపాలరెడ్డిగారు తన సహచరులతో కరచాలనం చేశారు. కేంద్రంలో మంత్రి పదవిని గురించి పత్రికల వారు ఆయనను ప్రశ్న వేయగా "మీకు అట్టి సమాచారం అందితే దయవుంచి నాకు తెలియజేయండి" అని ఛలోక్తిగా అన్నారు.

బహుశా ఆయనకు కేంద్రంలో ఆర్థికశాఖగాని, విద్యాశాఖగాని ఇస్తారని ఇక్కడ వదంతిగా వుంది (వి.వి.)

న్యూఢిల్లీ, మార్చి 12

కేరళ విద్యాబిల్లును సుప్రీంకోర్టుకు పంపాలని కేంద్రప్రభుత్వం తిరిగి నిర్ణయించినట్లు సూచనలు కానవస్తున్నాయి. రాజ్యాంగంలోని 143 వ సూత్రం ప్రకారం ఇలా సుప్రీం కోర్టుకు నివేదించే హక్కు రాష్ట్రపతి కున్నదని అంటున్నారు.

## ముంద్రా కుంభకోణంతో సంబంధంగల ఆఫీసర్లు

### విచారణ జరపడానికి సుప్రీంకోర్టు న్యాయమూర్తితో కమిటీ నియామకం

న్యూఢిల్లీ, మార్చి 13

ముంద్రా కుంభకోణంతో సంబంధంగల అధికారుల ప్రవర్తనను గురించి విచారించడానికి సుప్రీమ్కోర్టు న్యాయమూర్తి, ఇద్దరు సీనియర్ ఆఫీసర్లుగల ఒక కమిటీని నియమించాలని ప్రభుత్వం నిశ్చయించినట్లు నేడు రాజ్యసభలో దేశవ్యవహారాల సహాయమంత్రి శ్రీ దాతార్ తెలిపారు.

శ్రీ వి. కె. ధగే ప్రశ్నకు ఆయన జవాబు చెపుతూ పార్లమెంటులో ఆమోదించబడిన తీర్మానాన్ననుసరించి, ముంద్రా కుంభకోణంతో సంబంధం గల అధికారులపై చర్యలు తీసుకోవడం ప్రారంభమైందన్నారు.

దేశవ్యవహారాల మంత్రి శ్రీ పంత్ మాట్లాడుతూ తాను నెలకొల్పబోతున్న విచారణ కమిటీ నిబంధనలు చాగ్లా నివేదికను ప్రాతిపదిక చేసుకొని వుంటాయని చెప్పారు.

ఐ. సి. యస్. కేడర్కు చెందని ఉద్యోగులు కూడ యీ విచారణ క్రిందకు వస్తారా అని ప్రశ్నించగా "ఆవిషయం యింకా పరిశీలనలో వున్నదని" శ్రీ పంత్ జవాబు చెప్పారు.

శ్రీ వి. కె. ధగే అడిగిన ప్రశ్నలకు సమాధానంగానే మంత్రులు ఈ విషయాలను తెలిపారు.

సభ్యులనుండి వచ్చిన కొన్ని ఉపప్రశ్నలకు శ్రీ పంత్ సమాధానం చెపుతూ ఈ విచారణను ఆలిండియా సెర్వెంట్సు (డిసిప్లిన్, అప్పీల్సు) రూల్సుక్రిందనే జరిపించుతున్నామని చెప్పారు. అది బహిరంగవిచారణగా వుండగలదని తాననుకోవడం లేదన్నారు.

ఆ విచారణ కమిటీ నివేదికను సభవారి ముందు వుంచుతారా అని ప్రశ్నించగా శ్రీ పంత్ "మీ సూచన పరిశీలించబడుతుంది" అని అన్నారు

శ్రీ పంత్ ఇంకా యిలా చెప్పారు:

రూల్సుప్రకారం ఈ విచారణ జరిపే కమిటీలో న్యాయమూర్తి కాక మరొక యిద్దరు సీనియర్ ఆఫీసర్లు వుంటారు. ఇద్దరు ఆఫీసర్లలో ఒకరు ఏ సర్వీసుకు చెందిన అధికారిని విచారిస్తున్నారో ఆ సర్వీసుకు చెందినవారై వుంటారు. ఆయన కాక మరొక ఆఫీసరు వుంటారు.

కమిటీ సిఫార్సులు ప్రభుత్వానికి అందిన తరువాత తుది దశలో యూనియన్ పబ్లిక్ సర్వీసు కమిషన్తో సంప్రతిం చుతాం.

ఈ కమిటీలో అనధికారులను కూడా నియమించుతారా అని ప్రశ్నించగా పండిత పంత్ చలోక్తిగా యిలా అన్నారు:

"కమిటీలో ముగ్గురు వుంటారు. అందులో ఒకరు సుప్రీమ్ కోర్టు న్యాయమూర్తి, తతిమ్మా యిద్దరూ సీనియర్ ఆఫీసర్లు. ఇంకా అనధికారులను బాధపెట్టవలసిన అవసరం లేదనుకొంటాను."

మరొక ప్రశ్నకు ఆయన జవాబు చెపుతూ సుప్రీమ్కోర్టు న్యాయమూర్తి అధ్యక్షతన ఏర్పడే కమిటీకి ఇంత కాలంలో విచారణను పూర్తిచేయాలని గడువుపెట్టడం సాంప్రదాయం కాదన్నారు.

ప్రశ్న: ఈ కుంభకోణంలో చాల ఉన్నత స్థానంలోవున్న ఒక సీనియర్ ఆఫీసర్కు సంబంధం వుంది. అలాంటి పరిస్థితులలో మరొక సీనియర్ ఆఫీసర్ కమిటీలో కూర్చొని తన సహచరుణ్ణి

(మిగతా 2 వ పేజీలో)

## గజవెల్లి సభ్యుల ఎన్నిక రద్దు

### నిలుపుచేస్తూ హైకోర్టు ఉత్తర్వు

హైదరాబాదు, మార్చి 13

గజవెల్లి నియోజకవర్గంనుంచి శాసనసభకు ఎన్నికైన కాంగ్రెసు సభ్యులు శ్రీ నరసింహారావు, ముత్యాలరావుగార్ల ఎన్నికను రద్దు చేస్తూ ఎన్నికల న్యాయస్థానంవారిచ్చిన తీర్పుపై నేడు ఆంధ్ర హైకోర్టువారు స్టే ఆర్డరు జారీచేశారు. (వి. వి.)

## ఆంధ్ర హైకోర్టులో నూతన న్యాయమూర్తి పదవీ స్వీకారం

హైదరాబాద్, మార్చి 12

ప్రభుత్వ ప్లీడర్ శ్రీ శేషాచలపతిగారు నేడు ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో అదనపు న్యాయమూర్తిగా పదవీ స్వీకారం చేశారు.

తాత్కాలిక ప్రధాన న్యాయమూర్తి శ్రీ బి. చంద్రారెడ్డిగారు ఆయనతో ప్రమాణస్వీకారం చేయించారు.

నూతన న్యాయమూర్తిని ఆహ్వానించుతూ శ్రీ జి. నరసరాజుగారు ప్రసంగించారు.

శాసనసభ్యుడు సభలో ప్రసంగిస్తూ తమలపాకులు నమలరాదని భోపాల్ శాసనసభ స్పీకర్ రూలింగ్ ఇచ్చారు.

## లంబాడీ తండాపై సబ్ ఇన్స్పెక్టరు కాల్పులు

హైదరాబాద్, మార్చి 13

మహబూబునగర్ జిల్లా గోపన్నపేట గ్రామంలో ఒక సబిన్స్పెక్టరు లంబాడీ తండామీద దాడి చేసి కాల్పులు సాగించగా పన్నెండుగురు గాయపడ్డారనీ, ఈవిషయంలో పూర్తి సమాచారం సభవారి కందించాలని నేడు ప్రశ్నా సమయం అనంతరం సోషలిస్టు సభ్యుడు శ్రీ భాట్టం శ్రీరామమూర్తిగారు శాసనసభలో ఒక తీర్మానం ప్రతిపాదించారు.

దానిపై హోంమంత్రి రంగారెడ్డిగారొక ప్రకటనచేస్తూ ఇలా చెప్పారు:

కొత్తకోట గ్రామంలో చోరీ జరిగిందన్న సమాచారాన్నందుకొని సబిన్స్పెక్టరు గోపన్నపేట లంబాడీ తండాపై దాడిచేసి ఆగురిని అరెస్టు చేశారు. అరెస్టు అయినవారిని వెంట బెట్టుకొని పోలీసులు తిరిగి వస్తుండగా లంబాడీలు రాళ్ళతో వారిని ఎదిరించారు. అరెస్టు అయినవారిని విడిపించారు. వారూ, వీరూ అంతా కలిసి పోలీసు దళంపై పడ్డారు. పోలీసులు లాఠీచార్జీ చేయడంవల్ల లాభం లేకపోయింది. అప్పుడు కాల్పులు సాగించారు. ఒకే ఒకరికి గుండుదెబ్బ తగిలింది. అతడు ఆస్పత్రిలో కోలుకుంటున్నాడు. పోలీసులు ఆత్మరక్షణకోసం కాల్పులు చేశారని డిస్ట్రిక్ట కలెక్టరు నిర్ణయించారు.

# విదేశమారకం పరిస్థితి

## వివరాలు వెల్లడి చేయాలని వాణిజ్యమండలి తీర్మానం

న్యూఢిల్లీ, మార్చి 12

విదేశీ మారకం పరిస్థితిని గురించి ప్రభుత్వం వెంటనే వివరాలను ప్రకటించాలనీ, దీని పొదుపు కార్యక్రమాన్ని నిర్వహించడంలో ఆసక్తి కాపుల తోడ్పాటు కూడా తీసుకోవాలనీ భారత వాణిజ్య పరిశ్రమల మండలి సమాఖ్యవార్షిక సభ తీర్మానం చేశారు.

విదేశీ మారకాన్ని బిగించడం వల్ల చాలా ఇబ్బందులు కలుగుతున్నాయని వారా తీర్మానంలో పేర్కొన్నారు.

ప్రభుత్వం అతి జాగ్రత్త చూపడం వల్ల చాలా నష్టం వాటిల్లుతున్నదని వారు హెచ్చరించారు.

ప్రభుత్వం ఎప్పుడూ ఎగుమతులకు అవకాశం ఇవ్వాలనీ, గాకా పరిశ్రమను ప్రోత్సహించాలనీ తీర్మానంపై ప్రసంగించిన వక్తలంతా కోరారు.

ఎగుమతి వ్యాపారాన్ని ప్రభుత్వం ప్రోత్సహించాలని కోరుతూ మరొక తీర్మానం చేశారు.

రాష్ట్రాల అమ్మకపు పన్ను విధానాన్ని రూపొందించడానికి కేంద్రం ఒకే మాదిరి చట్టాన్ని తయారు చేయాలని కోరుతూ వేరొక తీర్మానం చేశారు.

వాణిజ్యమండలి సభ్యులు మూడు వర్గాలుగా చీలి ఆహారసమస్య, చిన్న పరిశ్రమలు, మధ్యతరగతి సమస్యను చర్చించి మూడు ప్రకటనలను తయారు చేశారు. సభవారీ మూడు ప్రకటనలనూ ఆమోదించారు.

# ఆంధ్రలో జవుళి మిల్లుల వివరాలు

హైదరాబాద్, మార్చి 12

ఆంధ్రలో మొత్తం 17 జవుళి మిల్లులున్నాయి. ఇందులో మూడు కాకినాడలో, ఒకటి అనంతపురంలో, రెండు తూర్పు గోదావరిలో, ఒకటి రాజమండ్రిలో, ఒకటి గుంటూరులో, ఒకటి తణుకులో, ఒకటి రేణిగుంటలో, మూడు ఆదోనిలో, ఒకటి గుంటకల్లులో, రెండు హైదరాబాద్ నగరంలో వున్నాయి.

ఆంధ్ర ప్రదేశ్‌లో సాలీనా పత్తి ఉత్పత్తి 392 పౌనులు గల బేళ్లు 133 వేలు. 1957లో 24,423,000 పౌన్ల నూలు, 40,742,000 గజాలబట్ట మన రాష్ట్రంలో ఉత్పత్తి అయింది.

ఈ 17 జవుళి మిల్లులుకాక సిర్పూరులో కృత్రిమ పట్టుమిల్లు మరొకటి వుంది. ఈ ఫ్యాక్టరీలో రోజుకు 5 టన్నుల రేయన్ నూలు ఉత్పత్తి చేయడానికి అవకాశంవుంది. దాని నుంచి 50 వేల గజాల రేయన్‌బట్ట తయారు అవుతుంది. ఈ ఫ్యాక్టరీలో 700 మగ్గాలున్నాయి. (వి. వి.)

# విద్యాసమస్యలపై పార్లమెంటు సభ్యుల ఇష్టాగోష్ఠి

న్యూఢిల్లీ, మార్చి 12

పార్లమెంటు సభ్యులు కొందరు నేడు విద్యాశాఖామంత్రి డాక్టర్ కె. ఎల్. శ్రీమాలి అధ్యక్షతను సమావేశమై విద్యాశాఖను గురించి ఇష్టాగోష్ఠి చర్చలు జరిపారు.

విశ్వవిద్యాలయాలలో విద్యాస్థాయి పడిపోతున్నందుకు వారంతా ఆందోళన వెలిబుచ్చారు. ఒక పద్ధతిలేకుండా దేశంలో విశ్వవిద్యాలయాల సంఖ్య పెరుగుతున్నదనీ, ప్రభుత్వం దాన్ని అదుపులో పెట్టాలనీ వారు కోరారు.

అన్ని స్థాయిలలోనూ ఉపాధ్యాయుల హోదాను, జీతాలను పెంచాలని సూచించారు.

విద్యాస్థాయిని పెంచడానికి ప్రభుత్వం తీసుకొన్న చర్యలను డాక్టర్ శ్రీమాలి వివరించారు. విద్యావ్యాప్తికి గత పది సంవత్సరాలుగా చేసిన కృషిని సమీక్షించారు.

ప్రాథమిక ఉపాధ్యాయుల జీతాలను, హైస్కూలు ఉపాధ్యాయుల వేతనాలను పెంచడానికి స్వర్గీయ మౌలానా ఆజాద్ చేసిన కృషిని ఆయన వివరించారు.

# సంగీత నాటక అకాడమీ బహుమతులు

న్యూఢిల్లీ, మార్చి 12

ఉపరాష్ట్రపతి డాక్టర్ రాధాకృష్ణ 1957-58 లో ఉత్తములైన గాయక నాటక, నాటకకర్తలకు సంగీత నాటక అకాడమీ బహుమతులను పంచిపెట్టారు.

బహుమానాలు గ్రహించిన వారి పేర్లివి: శ్రీ గణేశ రామచంద్ర బెహరేబువా (హిందుస్తానీ గాత్రం.)

శ్రీ యూసుఫ్ అలీఖాన్ (హిందుస్తానీ వాద్యం, సితారు.

శ్రీ చెంబై వైద్యనాథ భాగవతారు (కర్ణాటక గాత్రం).

శ్రీ బూదలూరు కృష్ణమూర్తిశాస్త్రి (కర్ణాటక వాద్యం - గోట్టువాద్యం)

శ్రీ గురు అమోంబాసింగ్ (మణిపురి నృత్యం).

శ్రీ టి. కె. చందుపణిక్కర్ (కథకళి నృత్యం.

శ్రీ మామావరేర్కర్ (నాటక రచన).

శ్రీ అహీంద్ర చౌదరి (నాటకాభినయం).

శ్రీ శచీన్‌దేవ్ బర్మన్ (ఫిల్మ్ సంగీత దర్శకత్వం).

శ్రీమతి దుర్గాబాయిఖోటే (ఫిల్మ్ అభినయం).

హిందుస్తానీ గాత్ర విద్వాంసురాలు శ్రీమతి అంజనీబాయి మల్పేకర్‌ని సంగీత నాటక అకాడమీ గౌరవ సభ్యురాలుగా నియమించారు.

# వెంకటగిరిలో ఇళ్ల పన్నుల సమస్య

వెంకటగిరి, మార్చి 10

నెల్లూరుజిల్లా వెంకటగిరి పంచాయితీబోర్డువారు పెంచిన ఇళ్లపన్నులను తగ్గించే విషయమై మంత్రుల వద్దకు రాయబారం వెళ్లాలని ఈ నెల 4 వ తేదీ రేట్ పేయర్లసంఘ సమావేశంలో నిశ్చయించారు. శ్రీ కె. ఎల్. నారాయణరావుగారు ఈసమావేశానికి అధ్యక్షత వహించారు.

శ్రీయుతులు పి. నారాయణస్వామి, కె. విశ్వనాథం, హెచ్. శ్రీనివాసరావు, ఎన్. ఎ. కృష్ణయ్య, టి. వెంకటసుబ్బయ్య, వి. రంగయ్య, వీరం రామనాథం, కె. యానాదయ్యశెట్టి తదితరులు ఈ సమావేశంలో మాట్లాడారు.

# గూడూరులో సాహిత్య సభ

గూడూరు, మార్చి 10

నెల్లూరు జిల్లా గూడూరు మునిసిపల్ ఎలిమెంటరీ బాలికల పాఠశాలలో ఈనెల 4 వ తేదీ సాయంకాలం "లలితకళాసమితి" వారిచే సాహిత్యసభ జరిగింది. గరల్స్ హైస్కూలు తెలుగు పండితులు విద్వాన్ శ్రీ గొట్టిముక్కల రామయ్యగారు అధ్యక్షత వహించారు.

బోర్డు హైస్కూలు తెలుగుపండితులు విద్వాన్ ఉ. వే. శ్రీమాన్ బి. రంగాచార్యులుగారు ఆరవ ఫారం విద్యార్థుల పాఠ్యభాగమైన "కుమారాస్త్రవిద్యాప్రదర్శనం"లోని దుర్యోధనుని పాత్ర చిత్రణమునుగూర్చి ఉపన్యసించారు.

# శ్రీ పురిపండావారికి సన్మానం

విశాఖపట్నం, మార్చి 10

సుక్రిపాలెం యువజనసంఘం వారు నిన్న సాయంకాలం శ్రీ పురిపండా అప్పలస్వామిగారిని ఘనంగా సన్మానించారు. సంఘం అధ్యక్షుడు శ్రీ ఓ. వి. యస్. పాత్రుడుగారు అధ్యక్షతవహించారు. అధ్యక్షులు శ్రీ అప్పలస్వామిగారిని పరిచయం చేస్తూ, వారి భాషాసేవనూ, పాండిత్య పటిమనూ విపులంగా వివరించారు.

శ్రీ అప్పలస్వామిగారు తమ కృతజ్ఞత తెలుపుతూ తాము రాసిన వ్యావహారిక ఆంధ్ర మహాభారతం గురించి వివరించారు.

శ్రీ పాత్రుడుగారూ, శ్రీ నరసింహమూర్తిగారు, శ్రీ గ. రాములుగారు సంఘ కార్యక్రమం గూర్చి ఉపన్యసించారు. శ్రీ మాగడ వీర వెంకట సత్యనారాయణమూర్తిగారు వందనాలు తెలిపారు.

# చదువుకంటె పిల్లల హాజరుకే ప్రాధాన్యం

## ప్రభుత్వ విధానంపై విమర్శ

అమలాపురం, మార్చి 10

ఉపాధ్యాయుడు బోధించడం కంటె పిల్లల హాజరుకే ప్రభుత్వం ప్రాధాన్యం ఇస్తున్నదని, ఇది శోచనీయమని తూర్పుగోదావరిజిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ నడింపల్లి రామభద్రరాజుగారు అమలాపురం తాలూకా ప్రాథమికోపాధ్యాయ సప్తమ మహాసభలో విద్యావిషయిక మహాసభకు అధ్యక్షత వహిస్తూ చెప్పారు.

ఉపాధ్యాయుల వేతనం పెంచాలనే ఉద్దేశంతో బడ్జెట్‌లో కొంత సొమ్ము కేటాయించారని, యీ హెచ్చింపు సరిపోదని అన్నారు. ఉపాధ్యాయుని కుటుంబపోషణకు సరిపడే వేతనం ఇవ్వడం న్యాయమని చెప్పారు.

ఈ మహాసభ మార్చి 2 వ తేదీన కామనగరువులో శ్రీ శారదా ఎయిడెడ్ ప్రాథమికోన్నత పాఠశాలలో ప్రారంభమైంది. విద్యావిషయిక, వస్తు, చిత్రకళా ప్రదర్శనాన్ని శ్రీ నడింపల్లి రామభద్రరాజుగారు ప్రారంభించారు. ఉదయం సమావేశానికి అమలాపురం మండల కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ కుంపట్ల వీరరాఘవులుగారు అధ్యక్షత వహించారు.

తరువాత ఉపాధ్యాయసంఘ కార్యవర్గ సమావేశం శ్రీ పడాల దుర్గారావుగారి అధ్యక్షతను ప్రారంభమైంది. నూతన కార్యవర్గానికి శ్రీ పడాల దుర్గారావు (అధ్యక్షులు), శ్రీ చిక్కం నాగేశ్వరరావు (కార్యదర్శి) గార్లు ఎన్నికైనారు.

భోజనానంతరం జరిగిన విద్యావిషయిక సభలో అమలాపురం తూర్పు రేంజి స్కూళ్ళ డిప్యూటీ ఇన్‌స్పెక్టరు శ్రీ బి. ఎల్. ఎన్. శాస్త్రిగారు బేసిక్ విద్యను గురించి ఉపన్యసించారు.

సాయంకాలం జరిగిన మహాసభకు 'గోష్ఠి' సంపాదకులు శ్రీ గుమ్మడిదల వెంకటసుబ్బారావుగారు అధ్యక్షత వహించారు.

ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ దువ్వూరి వెంకట కృష్ణారావు (అడ్వొకేట్) గారు ఉపన్యసిస్తూ, ఉపాధ్యాయుడు సంఘంలో చేరడానికి ముందు మేనేజిమెంటు అనుమతి పొందాలనే జి.ఓ.ను ప్రభుత్వం ఎందుకు పెట్టిందో తనకు అర్థం కావడం లేదన్నారు.

సభాధ్యక్షులు ఉపన్యసిస్తూ వివిధ మేనేజిమెంట్లను రద్దుచేయాలని, పదకొండు సంవత్సరాలవరకు ప్రాథమిక విద్యను నిర్బంధం చేయాలని కోరారు.

జిల్లాసంఘ సహాయ కార్యదర్శి శ్రీ కెదలి గంగిశెట్టిగారు మాట్లాడుతూ, ద్వితీయ ప్రణాళికలో నిరుద్యోగ సమస్య పరిష్కారానికి కృషి చేస్తుండగా, ప్రాథమిక పాఠశాలలలో సగటు హాజరును పెంచి ఉపాధ్యాయులలో నిరుద్యోగం పెంచుతున్నారన్నారు.

సాయంకాలం ప్రాథమిక విద్యార్థులచే స్థానిక ప్రదర్శనాలు జరిగాయి. ఉత్తమ ప్రదర్శనలకు, ప్రదర్శకులకు, వస్తుప్రదర్శనలో ఉత్తమమైనవాటికీ బహుమతులు యివ్వబడ్డాయి.

సభ జయప్రదం కావాలని కోరుతూ పలువురు ప్రముఖు సందేశాలు పంపించారు.

# నెల్లూరు అల్యూమినియం కార్మిక సమావేశం

నెల్లూరు, మార్చి 10

నెల్లూరు పట్టణ అల్యూమినియం కార్మికసంఘ సమావేశం నిన్నటిరోజు పింగాణి కార్మికసంఘ ఆఫీసులో జరిగింది. శ్రీ పరుచూరి రామకోటయ్యగారు సంఘం ఆవశ్యకతను గూర్చి వివరించారు. సమావేశంలో ఈ దిగువవారితో కార్యవర్గాన్ని ఎన్నుకొన్నారు.

పరుచూరి రామకోటయ్య (గౌరవాధ్యక్షులు), వాసిరెడ్డి సింహాద్రి (అధ్యక్షులు), వెన్నేటి అప్పారావు (కార్యదర్శి), మిడతాని రామారావు (సహాయ కార్యదర్శి), బండి వెంకటరమణ (కోశాధికారి), మరో ఆరుగురు వర్కింగ్ కమిటీ సభ్యులు.

ట్రేడ్ యూనియన్ చట్టం కింద యూనియన్ను రిజిష్టరు చేయాలని తీర్మానించారు.

హింగల్ గంజ్ ప్రాంతంలో పాకిస్తాన్ సరిహద్దు పోలీసులు ఏడుగురు భారతీయుల్ని ఎత్తుకుపోయారు.

# పులిమామిడి జమీందారు దౌర్జన్యాలు, అక్రమాలు

## ప్రజలకు రక్షణ ఇవ్వాలని హైద్రాబాద్ జిల్లా కమ్యూనిస్టు కమిటీ కార్యదర్శి విజ్ఞప్తి

హైద్రాబాద్, మార్చి 10

ఇబ్రహీంపట్నం తాలూకా పులిమామిడి గ్రామ జమీందారు చేస్తున్న దౌర్జన్యాలు, అక్రమాలు, అతడు చాలాకాలంగా అమలు జరుపుతున్న వెట్టిచాకిరీని ఆంధ్ర ప్రజలదృష్టికి తెస్తూ హైద్రాబాద్ జిల్లా కమ్యూనిస్టు కమిటీ కార్యదర్శి శ్రీ కె. కృష్ణమూర్తిగారు ఈ దిగువ ప్రకటన చేస్తున్నారు.

ఇబ్రహీం పట్నం తాలూకాలోని పులిమామిడి గ్రామంలోని జమీందారు కొత్తపల్లి రామచంద్రారెడ్డి దౌర్జన్యాలను గురించి ఆ గ్రామ ప్రజలు ఆరు మాసాముల క్రితం ప్రభుత్వం ముందు మొరపెట్టుకున్నారు. ప్రభుత్వాధికారులు డిప్టీ కలెక్టరు, కలెక్టరు, డి. ఐ. జి., డి. యస్. పి. గారలు స్వయంగా వచ్చి, గ్రామప్రజలందరినీ పిలిపించి విచారణ చేశారు. పై అధికారులు ప్రజలకు కొన్ని వాగ్దానాలు కూడా చేశారు. ఇంతవరకు ప్రజలకు అతీగతీ లేదు.

పైగా ప్రజలు ప్రభుత్వంముందు మొరపెట్టుకున్నందుకు కక్షతో రామచంద్రారెడ్డి పోలీసు స్థానికాధికారులకు లంచాలుపెట్టి అక్రమంగా కేసులు బనాయించి, వ్యవసాయాలు, కూలినాలి చేసుకోకుండా కోర్టుల చుట్టూ త్రిప్పడంతో ప్రజలు ప్రభుత్వంతో మొరపెట్టుకొని కొత్తబాధను కొని తెచ్చుకున్నట్లయింది. ఈ తాలూకానుండి ఎన్నికైన కాంగ్రెసు ఎం. యల్. ఎ గారు రామచంద్రారెడ్డియింటిపై రవీకారుగా పనిచేయడము ప్రజలు తమకండ్లారా చూశారు.

ప్రభుత్వం రామచంద్రారెడ్డిపై ఏ చర్యా తీసుకోనలేదు. పైగా ప్రజలపైననే అక్రమంగా కేసులు బనాయించడంతో ప్రభుత్వం యొక్క వైఖరిని అనుమానించవలసి వస్తుంది. జమీందారీవిధానం దేశాభివృద్ధికి ప్రబల అటంకమని ప్రజలజీవితాలను చక్కదిద్దుతామని బడాబడా ఉపన్యాసాలు కొట్టే పెద్దలు ప్రజలపై జరుగుతున్న అన్యాయాలయెడ ఒక జమీందారు క్రూరంగా ప్రజలనుఅణచి తనకు బానిసలుగా చేసుకోనడానికి చేస్తున్న అమానుష ప్రయత్నాలను అరికట్టజాలకపోవడంలోగలఆంతర్యం యేమిటి. చట్టబద్ధమైన న్యాయసమ్మతమైన తమ కోరకలను సాధించుకోవడానికి, కాంగ్రెసుమార్కు ప్రజాస్వామ్యంలో ప్రజలు యెన్ని అవరోధాలను ఎదుర్కోవలసి వస్తుందో ఇదొక ప్రత్యక్ష తార్కాణం. రోజు రోజుకు ఈ జమీందారు కర్కశత్వంతో ప్రజపైన నానారకాల వత్తిడి తెస్తున్నాడు.

ప్రభుత్వాధికారులముందు ప్రజలు యావత్తు స్త్రీలు వృద్ధులతో సహా ఈ క్రింది తమ కష్టాలను రుజువు పర్చుకున్నారు.

ఫుల్లరి పేరుతో ఆవుకు 4 రూపాయలు, గేదలకు 7 రూపాయల చొప్పున వందల రూపాయలు అక్రమంగాతింటూ వస్తున్నాడు. నిరుపేదలగు యాదవులవద్ద ప్రతిసంవత్సరం 1150 రూపాయలు ఫుల్లరి, 50 వెట్టి యాటలుతింటూ వచ్చాడు. బందెల దొడ్డిలో తనకు కోపంవున్న ప్రతివాని పశువులను నిర్బంధంగా పెట్టి, అట్టి డబ్బు ప్రభుత్వానికి చెల్లించక దిగమ్రింగాడు.

## గ్రామంలో వెట్టి లంచాలు

గ్రామంలో రైతులు ఇతనికి వుచితంగా బండ్లు కట్టాలి. ప్రతిరోజు యెనిమిదిమంది హరిజనులు ప్రతిఫలం యేమీ తీసుకోకుండా పనిచేయాలి. పాత గోడలు పెట్టుకున్నా తన అనుమతి పొందాలి. కనీసం 50 రూపాయ లైనా ముడుపు ఇవ్వకుండా ఇతని అనుమతి దొరకదు. ఈ గ్రామ ప్రజల జీవితాన్ని అన్ని విధాల నిర్బంధంలో పెట్టి, వారి అమాయకత్వాన్ని వుపయోగించుకొని, ప్రభుత్వ అధికారులలో నున్న లంచగొండితనాన్ని పురస్కరించుకుని, గ్రామాధికార్లను చేతిలోపెట్టుకొని గ్రామంలో యెదురులేకుండా ప్రజలపైన క్రూరంగా నిలువుదోపిడీ సాగించుతూ వచ్చాడు. ఇంతకు పూర్వం ఆ గ్రామంలో యెవరైనా ఈ బాధలు భరించజాలక యెదురు తిరిగిన వారిపైన బూటకపు కేసులు పెట్టి నానా కడగండ్లపాలు చేసి, అణగత్రొక్కుతూ వచ్చాడు.

ఇప్పుడు గ్రామప్రజలంతా ఏకమై తమ బాధలను పరిష్కరించుకో పూనుకోగా గ్రామంలోని ముఖ్యమైన రైతులపై ఇతర ముఖ్యులందరిపై అబద్ధపుకేసులు పెట్టించి, కోర్టుల చుట్టూ త్రిప్పుతున్నాడు. తనకాళ్ళు పట్టుకోవడంతప్ప మరొక మార్గం లేదంటూ తలపొగరు తనంతో ప్రజలపై నానావత్తిడులు తెస్తున్నాడు. కొందరిని గ్రామంలో ఏజంట్లుగా వారికి ఆశలుకల్పించి గ్రామంలో గుండాచర్యలు రేపడానికి ప్రయత్నాలు చేస్తున్నాడు.

ప్రజలు ప్రశాంతంగా తమ న్యాయసమ్మతమైన, చట్టబద్ధమైనకోర్కెలను తీర్చవలసిందిగా మొరపెట్టుకోగా ప్రభుత్వం ప్రదర్శిస్తున్న నిర్లక్ష్యవైఖరితో మరెక్కి మరీ క్రూరకృత్యాలకు తలపడుతున్న జమీందారుల దురంతాల తీవ్రతతో వచ్చే విషమ పరిణామాలకు ఎవరు బాధ్యత వహించవలసి వుంటుందో జవాబు చెప్పుకోవలసిందిగా ప్రభుత్వాన్ని సూటిగా అడుగుతున్నాను.

## ప్రజాతంత్రవాదులకు విజ్ఞప్తి

దేశాభివృద్ధికి ప్రబల ఆటంకంగా వున్న ఈ జమీందారీ దుష్టశక్తుల నిలువుదోపిడికి వ్యతిరేకంగా పోరాడుతున్న ప్రజలకు రక్షణ ఇవ్వజాలని ప్రభుత్వ దివాళాకోరుతనాన్ని, ప్రజాస్వామిక హక్కులకు ఎలాంటిరక్షణ లేకుండా వుండడం మూలంగా ప్రజలను ఒక దౌర్జన్యపరుడైన జమీందారు బానిసలుగా అణచిపెట్టడానికి అవకాశం మిస్తున్న పరిపాలనా విధానాన్ని ప్రజాస్వామిక వాదులెవరూ అసహ్యించుకోక మానరు. నేడు ప్రభుత్వంలో ప్రబలియున్న లంచగొండితనంతో వస్తున్న అనర్థకాలను బట్టబయలు చేయడం, కండ్లముందర పులిమామిడి ప్రజలపైన జరుపబడుతున్న అక్రమాలనుండి, ఆ ప్రజలకు రక్షణ కల్పించడం ప్రతి ప్రజాశ్రేయోభిలాషి కర్తవ్యమని వేరే చెప్పనవసరంలేదనుకుంటాను.

ఇబ్రహీం పట్నం తాలూకాలోని యావత్తు ప్రజలు, ప్రజాస్వామికవాదులు తమతోటి ప్రజలపై ఒక జమీందారు చేస్తున్న దౌర్జన్యచర్యల నుండి ఆప్రజలరక్షణకు బాసటగా నిలబడి జమీందారీ నిలువుదోపిడీ ఏ మూల జరిగినా ఇక సహించమని చట్టబద్ధమైన తమ హక్కుల సాధనకు ఏకకంఠంతో అంతా పోరాడుతామని ముందుకు రావలసివుందని ప్రజలకు, ప్రజాతంత్ర వాదులకు విజ్ఞప్తిచేస్తున్నాను. ఈ క్రింది కోరికలను బలపర్చవలసిందిగా మనవిచేస్తున్నాను.

రామచంద్రారెడ్డి నేటికి చేస్తూ వచ్చిన అక్రమాలన్నింటిని బహిరంగంగా విచారించి అతనిపై తగిన చర్య తీసుకోవాలి. రైతులు రామచంద్రారెడ్డికి 75 వేలు చెల్లించికొన్న భూములు పట్టా యివ్వాలి. గ్రామ గైరానును జంగ్లాతునుండి విముదల చేయాలి. ప్రభుత్వ కంచ యితర లావునీ భూములను భూమిలేని హరిజనులు, యితర గ్రామ పేదలకు సేద్యాని కివ్వాలి. దేవాలయపు భూమిని పూజారి స్వాధీనం చేయాలి. దేవాలయపు ఆదాయాన్ని యింత కాలంగా దిగమ్రింగిన రామచంద్రారెడ్డి నుండి దేవాలయానికి పరిహారం యిప్పించాలి. ప్రజలపై అక్రమంగా బనాయించి పెట్టిన ఫోర్జరీ కేసులను ఉపసంహరించుకోవాలి.

## భూముల సమస్య

రమారమి 30 సంవత్సరాలుగా రామచంద్రారెడ్డి గ్రామాధికారాలను చేజిక్కించుకుని, భూయిల రికార్డు నంతా తలక్రిందులు చేశారు. పట్టాలు తలక్రిందులు చేసి భూములు ఆక్రమించాడు. గ్రామానికి గైరాను లేకుండా చేయడానికి గైరానును ఫారెస్టులో చేర్పించి వ్యవసాయదారులు చెప్పుచేతల్లో అణగిపడి యుండేట్లు చేశాడు. చాకిరీ యినాముదారుల భూములను ఆక్రమించుకుని వారి నోట దుమ్ముకొట్టాడు.

గ్రామంలో దేవాలయపు భూమి పూజారి స్వాధీనంలో వుంటే గ్రామ రైతులు, యితరప్రజలకు ఆధారమౌతుందని పూజారివద్ద నయాన భయాన రమారమి 250 యకరాల దేవాలయపు భూమి తన నిగరానీలోకి తీసుకుని వందలరూపాయల ఆదాయాన్ని దిగమ్రింగి దేవాలయాన్ని పాడుపెట్టాడు.

గ్రామకంఠం యెక్కడివరకు యెంతవుందో యెవరికి తెలియకుండా వుంచి, యిండ్లు కట్టుకునే ప్రతివారి వద్ద వందలకొద్ది డబ్బు నిర్బంధంగా వసూలుచేసుకుని తిన్నారు. ఈ బాధలు పడజాలక ఇతరగ్రామాలకు బ్రతుక వెళ్ళినవారి కొంపలు కబ్జా పెట్టుకుని, ఇతరులకు అమ్ముకోవడం, వారువచ్చి తమఇల్లు తమకు కావాలంటే పోలీసు సహాయంతో మెడలు పట్టి గెంటడం చేస్తున్నాడు.

గ్రామంలో వ్యవసాయదారులవద్ద

# కడప జిల్లాలోని ఉరుటూరు, దొంగల చెరువుల మరమ్మతు

## జిల్లా కలెక్టరుకు రైతునాయకుల విజ్ఞాపన

కడప, మార్చి 11

కడపజిల్లా కలెక్టరుగారిని జిల్లా రైతుసంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ కె. వెంకట్రామరెడ్డి, కడపతాలూకా రైతుసంఘ అధ్యక్షు, కార్యదర్శులు శ్రీ జి. సిద్ధిరెడ్డి, యస్. నాగిరెడ్డిగార్లు మార్చి 10 వ తేదీన కల్సుకొని ఈ క్రింది కోర్కెలతో కూడిన మెమొరాండమును సమర్పించారు. కడపకు సమీపంలోనున్న ఉరుటూరు, దొంగల చెరువులకు సంబంధించిన కోర్కెలివి:

ఊటుకూరు చెరువునష్టాయి ఘానలు రిపేరు చేయాలి. కాలువ కట్టలు తెగిపోయినచోట్ల రిపేరీ సాగించాలి. మూలవంకకు అడ్డంగావున్న ఆనకట్టలో పడిన గండిని పూడ్చి మరమ్మతు చేయించాలి. చెరువుకట్టలో పెద్ద తూముకు దగ్గరగా మరొక తూము నిర్మించాలి. లేదా పెద్ద తూము నీరు చమూలియా పేట, నబీకోట భూములకందుట కనుగుణ్యంగా పెద్దతూము కాలువకు చమూలియా పేట కాలువదగ్గర చిన్న డాము నిర్మించాలి.

దొంగల చెరువులోని పూడికను తీయించాలి. లేదా చెరువులోని నుట్టిని రైతులు తోలుకొనుటకు వీలుగా ట్రోవసౌకర్యం కలుగ చేయాలి.

చెరువు అలుగు ఎత్తు 1½ అడుగు పెంచాలి. కట్టను బలీయ మొనర్చాలి.

మల్లేమడుగు దగ్గర కట్టబడిన ఆనకట్ట శిథిలావస్థలోవుంది. దానిని రిపేరీ చేయించాలి. శేషాచలం పర్వతలోయలలోగున్న విసుగని మడుగు నుండి నీటిని మల్లెమడుగుకు అందించే ఏర్పాట్లు చేయాలి.

దొంగలచెరువుకు నీరందించు చున్న లింగన్న ఆనకట్ట సప్లయి కాలువలను కూడ తగుదీతిని రిపేరీ చేయించాలి.

ఈ సందర్భంలోనే కడపతాలూకా చింతకొమ్మ దిన్నె ఫిర్కాలోని గుర్రం చెరువు తెగిపోయినందువల్ల దాని క్రింది ఆయకట్టుకు నీరందకపోవడమే గాక ఆ చుట్టుపట్ల నున్న లక్కిరెడ్డిపేట, లింగారెడ్డిపల్లె, పడగల పల్లెలకు చెందిన గ్రామాలకు చెందిన బావుల్లో నీరు లేక అల్లాడుతున్నారని, అందువల్ల పై చెరువు మరమ్మతు చేయాలని కోరుతూ ఒక మెమొరాండము సమర్పించబడింది.

కడప తాలూకా ఖాజీపేట ఫిర్కాలో నున్న నల్లవాగు కడ్డంగా గుత్తికోట్టాల దగ్గర ఒక ఆనకట్టను నిర్మించడంద్వారా వృథాగాపోతున్న కె. సి. కెనాల్ నీటితో 400 ఎకరాల భూమిని సాగుచేసుకోవచ్చునని, ఈ విషయాన్ని కొమ్మలూరు రైతాంగం వెనుకఎన్నో మార్లు ప్రభుత్వ దృష్టికి తెచ్చినా ప్రయోజనం లేకపోయిందని, ఇప్పుడైనా ప్రభుత్వం కదలి వెంటనే దర్యాప్తు చేసి, తగు చర్యలు తీసుకోవాలని కోరుతూ మరొక మెమొరాండం సమర్పించబడింది.

జిల్లా కలెక్టరుగారు అన్నింటిని సావధానంగా విని సత్వరమే వీటిపై తగు చర్య తీసుకొనునట్లుగా తహసీలు దారుకు వ్రాసిపంపుతానన్నారు.

నెవేలీ లిగ్నైట్ ప్రాజెక్టు ద్వితీయ ప్రణాళికా కాలంలో ఇమిడి ఉన్నదని మద్రాసు శాసనసభలో కార్మికమంత్రి వెంకట్రామన్ ప్రకటించారు.

# క్రిస్టఫర్ వాలంటీరు సంస్థపై చర్యలు

## రాష్ట్ర ప్రభుత్వం ఆలోచిస్తున్నదని కేరళ న్యాయశాఖామంత్రి వెల్లడి

తిరువనంతపురం, మార్చి 12

కేరళ రాష్ట్రంలోని క్రిస్టఫర్ వాలంటీరు సంస్థపై చర్యలు తీసుకొనే విషయం రాష్ట్రప్రభుత్వ పరిశీలనలో వున్నదని శాసనసభలో న్యాయమంత్రి శ్రీ వి. ఆర్. కృష్ణయ్యర్ నేడు తెలిపారు.

క్రిస్టఫర్ వాలంటీరు సంస్థ సాగిస్తున్న చర్యలు మితిమీరి పోతున్నాయని తెలియజేస్తూ రాష్ట్ర ప్రభుత్వం కేంద్రానికి వ్రాసిందని కూడా ఆయన వెల్లడించారు. అయితే ఈవిషయంలో కేంద్రంతో జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలను సభ వారికి అందజేయటం సాధ్యం కాదనీ, మంచిదికూడా కాదనీ ఆయన అన్నారు.

'కాశ్మీరులో సంక్షోభ పరిస్థితి ఏర్పడినప్పుడు క్రిస్టఫర్ వాలంటీరు సంస్థ దేశానికిద్రోహం చేసేలాగా వ్యవహరిస్తుందని అనుమానిస్తున్నారా' అని ప్రతిపక్షనాయకుడు శ్రీ పి. టి. చాకో ప్రశ్నించగా, 'అనుమానించటానికి తగినన్ని ఆధారాలు కలవని' శ్రీ కృష్ణయ్యర్ సమాధానమిచ్చారు. క్రిస్టఫర్ వాలంటీరు సంస్థ ఒక విదేశంతో సంబంధాలు కలిగి వున్నదనీ, అయితే ఆదేశం పాకిస్తాన్ మాత్రం కాదనీ ఆయన వివరించారు.

మధ్య మలబారులో క్రిస్టఫర్ల రహస్యంగా నడుపుతున్న తుపాకి కర్మాగారాన్ని పోలీసులు కనిపెట్టి, పట్టుకొన్నారని కూడా శ్రీ కృష్ణయ్యర్ వెల్లడించారు.

# శిఖరాగ్ర చర్చలు

## కృశ్చేవ్, బుల్గానిన్‌ల ఆశాభావం

లండన్, మార్చి 11

శిఖరాగ్ర సమావేశం కోసం వాషింగ్టన్‌కు వెళ్ళడానికి తనకూ, బుల్గానిన్‌కు ఏట్టి అభ్యంతరం లేదని కృశ్చేవ్ ఈజిప్టు పోలెండు కమ్యూనిస్టుపార్టీ పత్రిక 'ట్రిబ్యునాలుడు' విలేఖరులతో ఒక ఇంటర్వ్యూలో అన్నారు.

ఆయన ఇంకా ఇలా అన్నారు:

ఉదయం ఫలహారంచేసి మాస్కో నుండి బయలుదేరితే రాత్రి భోజనానికి అమెరికా చేరుకుంటాము.

ప్రధాని బుల్గానిన్, ప్రథమ ఉప ప్రధాని అనస్తాస్ మికోయాన్‌లు కూడా రెండుచోట్ల సభల్లో ప్రసంగిస్తూ శిఖరాగ్రసమావేశం గురించి ప్రస్తావించారు.

బుల్గానిన్ మైకాప్‌లో ఒక ఎన్నికల సభలో మాట్లాడుతూ శిఖరాగ్ర సమావేశం; ప్రపంచ ప్రజలందరూ పెట్టుకొన్న ఆశలను సఫలం చేయగలదన్నారు. ఐతే అందులోపాల్గొనే వారందరికీ అంగీకారం కుదుర్చుకోవాలనే హృదయ పూర్వక అభిలాష ఉండడం అవసరమన్నారు. అత్యవసరసమస్య లన్నిటినిగాని, వాటిలో కొన్నిటినిగాని పరిష్కరించగలుగుతే అంతర్జాతీయ ఉద్రిక్తత తగ్గి ఇంకా మిగిలిఉన్న సమస్యలన్నీ పరిష్కారం కావడానికి అనుకూల పరిస్థితు లేర్పడగలవన్నారు.

ఎరివాన్ (అర్మేనియా) లో ఒక ఎన్నికల సభలో ప్రసంగిస్తూ, "పరిస్థితులనుబట్టి చూస్తే శిఖరాగ్ర సమావేశం జరిగేలాగానే ఉంది" అని మికోయాన్ అన్నారు.

# కపిలేశ్వరపురం పంచాయితీ అధ్యక్షుని తొలగింపు

హైద్రాబాద్, మార్చి 12

కృష్ణాజిల్లా గన్నవరంతాలూకా కపిలేశ్వరపురం పంచాయతీ అధ్యక్షుని మార్చి 14 వ తేదీనుండి అధికారంనుండి తొలగిస్తూ ప్రభుత్వం ఉత్తర్వుచేసింది.

# రవి ఆర్టుథియేటర్ వారికి సన్మానం

భీమవరం, మార్చి 11

మద్రాసు రవి ఆర్టుథియేటర్ వారు భీమవరంలో 'రక్తకన్నీరు' నాటక ప్రదర్శనకు వచ్చిన సందర్భంలో వారికి ఈనెల 7 వ తేదీన స్థానిక యువజన ప్రజానాట్యమండలివారు సన్మానం జరిపారు.

శ్రీ రంగా మహల్ థియేటర్‌లో సభ ఏర్పాటుచేయబడింది. శ్రీ గొట్టిముక్కల వెంకట్రామరాజుగారు నాగభూషణం, పెరుమాళ్ళు, సీత గార్లను సభికులకు పరిచయంచేశారు. కళకోసం వారు చేస్తున్న కృషిని వివరించి వారిని పూలమాలాలంకృతుల గావించారు.

తరువాత నాగభూషణం, పెరుమాళ్ళుగార్లు సమాధానమిస్తూ, తాము ప్రజలతో తిరిగి సంబంధాలు నెలకొల్పుకునేటందుకే ఇక్కడికి వచ్చామన్నారు. తమ్ము సన్మానించిన యువజన ప్రజానాట్యమండలికి కృతజ్ఞత తెలియజేశారు.

తరువాత 'పరీక్ష' అను హాస్య నాటికను యువజన నాట్యమండలి వారు ప్రదర్శించారు. నాటక డైరెక్టరు శ్రీ మైలవరపు రామారావుగారి వందన సమర్పణతో సభ ముగిసింది.

# వెంకటగిరిలో జాతీయ పొదుపు ఉద్యమ సభ

వెంకటగిరి, మార్చి 10

నెల్లూరుజిల్లా వెంకటగిరి జమీందారు నాటకశాలలో ట్రెయినింగ్ స్కూలు హెడ్మాస్టరు శ్రీ అవధానిగారి అధ్యక్షతను జాతీయ పొదుపు ఉద్యమ సభ జరిగింది. తాలూకాలోని అధికార ప్రముఖ ఉద్యోగులు ఈ సభకు హాజరైనారు. బ్లాక్ డెవలప్‌మెంట్ వారు ఈ సభను ఏర్పాటు చేశారు.

జాతీయ పొదుపు ఉద్యమం, దాని ఆశయాలను గురించి శ్రీ ఎం. వెంకటసుబ్బయ్య, శ్రీ రామారావు, శ్రీ ఎన్. వి. కృష్ణయ్య (జిల్లా రైతుసంఘ కమిటీ సభ్యుడు) గార్లు మాట్లాడారు.

# క్రికెట్ పోటీలు

విజయవాడ, మార్చి 13

వెల్‌కం క్రికెట్ టోర్నమెంట్సులో ఈ సంవత్సరం పోటీలలో గెల్పొందినవారికి ట్రోఫీలు, యోగ్యతా పత్రాలు నిన్న స్థానిక వెల్‌కం హోటల్ మేడమీద జరిగిన సభలో శ్రీమతి సి. సుధారెడ్డిగారు బహూకరించారు. విజయవాడ డిప్యూటీ సూపరింటెండెంట్ ఆఫ్ పోలీసు శ్రీ సి. కృష్ణారెడ్డి అధ్యక్షత వహించారు. డాక్టరు పి. రామకృష్ణారావు రెడ్డిగారికి ఇతర ఆహూతులకు స్వాగతం చెప్పారు. కార్యదర్శి శ్రీ పి. భోగరావు రిపోర్టు చదివారు. ఈ సంవత్సరం గెల్పొందిన ఫ్రండ్స్ యూనియన్ క్రికెట్‌క్లబ్ వారికి రోలింగ్ షీల్డు ఇచ్చారు. ఈక్లబ్ కెప్టెన్ శ్రీ వి. ఆర్. పటేల్ ఆల్‌రౌండరుగా పేరు తెచ్చుకొన్న తాడేపల్లి కృష్ణా సిమెంటు క్రికెట్ ఆటగాడు శ్రీ సి. ఎస్. నటరాజన్, బెస్టు బేలరు పి. వి. ఎస్. రెడ్డి (గుంటూరు కాస్మపాలిటన్‌క్లబ్) బేట్స్‌మన్ శ్రీ సి. ఎస్. సూర్యప్రకాశరావు గార్లకుకూడా బహుమతులు ఇవ్వబడినవి. గెల్చిన ఆటగాండ్రందరకీ కప్పులూ, యోగ్యతా పత్రాలు ఇచ్చారు. శ్రీ పి. మాధవరావుగారి కృతజ్ఞతాభి వందనలతో సభ ముగిసింది.

# ఆర్యుల వ్యాప్తి, నాగరికతల గురించి దివ్యజ్ఞాన సమాజంలో ప్రసంగం

విజయవాడ, మార్చి 13

దివ్యజ్ఞాన సమాజంవారి నేషనల్ లెక్చరర్ మిస్. పేకీ గ్రహం (న్యూజిలాండ్) నిన్న స్థానిక దివ్యజ్ఞాన సమాజం సందర్శించి ఇరవయ్యోశతాబ్దిలో అన్వేషణ కొత్త పరిశోధనలు అనే విషయం మీద ఉపన్యసించారు. ఆర్యులయొక్క పుట్టుక, వారివ్యాప్తి జపాన్, చైనా, పెరూ, ఈజిప్టు మొదలగు దేశాలలో ఎలా జరిగింది చిత్రాలతో వివరిస్తూ ఉపన్యసించారు. ఆర్య నాగరికతా చిహ్నాలనుకూడా వీరు చూపించారు. శ్రీ మాగంటి సూర్యనారాయణగారు అధ్యక్షత వహించారు.

సమాజ అధ్యక్షులు శ్రీయడ్లపల్లి రామబ్రహ్మంగారు అభినందనలు తెల్పారు.

